

    

ఓమ్ శ్రీ సుదర్శనాయ నమః

# నమ్మాళ్వార్లును మణవాళ మహామునులును

22



రచన:

శ్రీ ఉ. వే. తిరుమలనల్లాన్ చక్రవర్తి

రామకృష్ణయ్యంగార్ స్వామి

శ్రీపరాంకుశ తిరువవతారాది

5071 అల్పిశి శుక్ల ప్రథమ శ్రీలక్ష్మీవాసర

మణవాళ మహామునుల షష్ఠశతాబ్దీ యవసరమున
ప్రకటించినవారు :

సి. మొదలియాండాన్.

సి. వేంకటాచలం.

సి. సుదర్శన శ్రీనివాసన్,
అడ్వకేట్.

నెం. 27, కాశి శెట్టి వీధి, మద్రాసు - 1.

Freedom Press, 138-A, T. H. Road, Madras-21.

శ్రీః

శ్రీమతే శఠకోపాయ నమః

శ్రీమతే రామానుజాయ నమః

శ్రీ వరవరమునయే నమః

# నమ్మాళ్వార్లును మణవాళ మహామునులును

[శ్రీ ఉ. వే. తిరుమలనల్లాన్ చక్రవర్తి రామకృష్ణయ్యంగారు స్వాముల ఉపన్యాస సంగ్రహము]

గుణమణి నిధయే నమో నమస్తే
గురుకుల ధుర్య నమో నమస్తే।
వరవరమునయే నమో నమస్తే
యతివర తత్త్వవిదే నమో నమస్తే॥

మనకు శరీరజన్మమును ఇచ్చువాడు తండ్రి. జ్ఞాన జన్మమును ఇచ్చువాడు ఆచార్యుడు. మొదటిది నశ్వరము, తరువాతది శాశ్వతము. అట్టి ఉత్కృష్టతగల జన్మమును ఒసగుచున్న ఆచార్యుడు తండ్రికన్న శ్రేష్ఠుడు.

## తండ్రియు ఆచార్యుడును

తండ్రి దేహమునకు కావలసిన అర్థములను కుమారునికి సేకరించి యిచ్చునట్లు ఆచార్యుడు ఆత్మతత్త్వమునకు

కావలసిన సదర్థములను సేకరించి యిచ్చుచున్నాడు. అంతిమ సమయములో తన బిడ్డలకు సొంతమైన ఆస్తులను అప్పగింపక యుండుట తండ్రికి శక్యమా ? ఆచార్యుడును తన మహార్థములను అంతిమ సమయమున అంతరంగ శిష్యులకు సొంతము కావించియే పోవుదురు. "పాత్రస్థం ఆత్మజ్ఞానం చ కృత్వా పిండం సముత్సృజేత్" అని అర్హతగల శిష్యునివద్ద ఆత్మవిద్యను అప్పగించి శరీరమును వదలవలెను అని భగవంతుడు చెప్పుచున్నాడు. భీష్ముడను సూర్యుడు అస్తమించిన జ్ఞానమను ప్రకాశము అల్పమగును, అని త్వరగా ఉపదేశమును వినుమని శ్రీకృష్ణుడు ధర్మపుత్రుని ప్రేరించుటయు, ఇచ్చట ఎఱుంగతగినది.

## ఆచార్యులిచ్చిన సదర్థములు

మన సంప్రదాయములో ప్రథమాచార్యులు నమ్మాళ్వార్లు. చరమాచార్యులు మణవాళ మహామునులు. ఆ యిద్దఱును మనకు సదర్థములను అంతిమకాలమున నొసగి, ఉజ్జీవనమార్గమును చూపియున్నారు. ఈ యిద్దఱు ఆచార్యులను కృతజ్ఞతా పూర్వకముగా అభినందించుట మనకు కర్తవ్యము.

నమ్మాళ్వార్లు "నాళ్ కళుమ్ నణియవాన" అని శరీరావసానము సమీపించినది, దాస్యముచేయ, కర్మములు స్వయముగానే నశించును, అనునట్టి ఉపదేశములను ఒసగుచున్నారు.

మణవాళమహామునులు శరీరావసానము దగ్గరించి నప్పుడు "ఆచార్యహృదయ వ్యాఖ్యానము" అను మహార్థమును, మనకు సేకరించి యిచ్చియున్నారు. ముదిమిలో దేహము బలహీనమై శయనమున ఆనుకొనియుండు స్థితిలో కంఠమునకు నొప్పికలుగ వారు వ్రాయుచున్న పరిస్థితిని చూచి 'కందాడై అణ్ణన్' దేవరవారు ఎందులకు ఈ ప్రకారము ఆయాసపడుచున్నారు? అని అడుగగా, మణవాళమహామునులు "మీ పుత్రపౌత్రాదుల కోసము" అని వక్కాణించిరట. ఆచార్యహృదయ వ్యాఖ్యానము అంత ప్రయాసతో ముసలితనమున మణవాళమహామునులు మనకు ఉదారముగా ఇచ్చిన మహార్థము! ఆ వ్యాఖ్యానము లేనియెడల ఆచార్యుల ("నమ్మాళ్వార్ల") హృదయమును, మనము తెలిసికొనుట సాధ్యము కాదుగదా!"

ఇద్దఱు ఆచార్యులును మనకు సదర్థములను ఒసగియుండినను నమ్మాళ్వార్లు ఒసగిన అర్థమును ముడివిప్పి అనుభవించుట మనకు సాధ్యముకాదు. మణవాళమహామునులు ఒసగినదన్ననో సులభముగా తాననుభవింప తగినదై, నమ్మాళ్వార్లు ఒసగినదానిని ముడివిప్పి అనుభవింపింప శక్తమై విలసిల్లుచున్నది. ఇందువలన నమ్మాళ్వార్లకు కృతజ్ఞులమైన మనము అంతకంటెకూడ ఎక్కువగా మణవాళమహామునులకు కృతజ్ఞులముగ నుండవలయునని తెలియుచున్నది.

# ఆచార్యత్వపూర్తి

మన సంప్రదాయమున నమ్మాళ్వార్లు, శ్రీ రామానుజులవారు, మణవాళమహామునులు ఈ ముగ్గురికే ఆచార్యత్వపూర్తి కలదని చెప్పుచున్నారు. మణవాళమహామునులు అపరావతారముగా నుండుటచే శ్రీరామానుజులవారే అగుటచేతను, శ్రీరామానుజులవారు నమ్మాళ్వార్ల శ్రీపాదములో అణగియుండుటచేతను మనకు పరమోద్దేశ్యములైన నమ్మాళ్వార్ల శ్రీపాదములై విలసిల్లుచున్న శ్రీరామానుజులే గురువు, ఇతరులు కారు అనుటయు సమంజసము.

శరణాగతి మంత్రమును, తిరువాయ్ మొళిచే వివరించుచు "అడిక్కీళ్ అమర్న్దు పుగున్దేనే" అని తానును, శరాణగతి నొనర్చి తక్కినవారిని శరాణగతి చేయునట్లు ఉపదేశించుటచేత మంత్రవ్యాఖ్యానము, ఆచారము, ఆచారమున స్థాపించుట అను ఈ మూడునుకూడి అమరి ఆచార్యులై నమ్మాళ్వార్లు వెలుగుచున్నారు. "మన్త్రవ్యాఖ్యాకృదాచార్యః" "స్వయమాచరతే" "ఆచారేస్థాపయతి" యని యీ మూడును ఆచార్య లక్షణములుగా చెప్పియుండుటను చూడుడు.

మణవాళమహామునులు, ఈమూడు లక్షణములును పొంది ఆచార్యులై, విలసిల్లి యుండుటే కాక మంత్రవ్యాఖ్యానాంశమున నమ్మాళ్వార్లకన్నను గూడ శ్రేష్ఠత కలిగియున్నారు.

నమ్మాళ్వార్ల తిరువాయ్ మొழి, మంత్రవ్యాఖ్యాన మనుట మనకు స్పష్టముగా దెలియలేదు. ఈరీతిగా వ్యాఖ్యాన మగుచున్నది అని విశదపఱచి చూపవలసియున్నది.

మణవాళమహాముసులో అట్లు విశదపఱచి చూప నక్కఱలేక సాక్షాత్తుగా మంత్రమునకు వ్యాఖ్యానము ననుగ్రహించియున్నారు. ఇతరాచార్యులును ఈప్రకారము మంత్రములను వ్యాఖ్యానించి యుండినప్పటికిని అవి మణవాళమహాముసుల వ్యాఖ్యానమువలె లేవు. మణవాళమహాముసుల వ్యాఖ్యానము అతి విస్తరమో అతి సంగ్రహమో కాక కావలసినంతగా అమరి విశదముగా నుండుట అనుభవ సాక్షికము.

ఈ యిద్దఱు ఆచార్యులకును మోక్షమొసగు నుత్తారకాచార్యత్వము కలదు. 'పొన్నుల గాళీరో భువని ముழுదాళీరో' (పరమపదము నేలుదురా, లీలావిభూతి నేలుదురా) అను నమ్మాళ్వార్ల శ్రీసూక్తిచేతను, మణవాళమహాముసులు చింతచెట్టుకు మోక్షమిచ్చుటచేతను ఇది ప్రసిద్ధము.

## చరమ సర్వోపదేశము

ప్రథమపర్వనిష్ఠ వాచ్యార్థముగాను చరమపర్వనిష్ఠ గూఢార్థముగాను, నమ్మాళ్వార్ల ఉపదేశములో తెలియుచున్నవి. మణవాళమహాముసుల ఉపదేశములో నన్నచో కష్టములేక మాట్లాడు మాటలలోనే చరమపర్వనిష్ఠ మన కోటివారికిని సులభముగా స్పష్టమగుచున్నది. "సైవ్వారాలా పై

స్సులభయసి నః పఞ్చమోపాయత త్త్వమ్'' అని శ్రీవారి కాలములోనే ఉండి ప్రత్యక్షముగా ననుభవించిన యెఱుంబి యప్పా (శ్రీ దేవరాజాచార్యులు) చెప్పియుండుట చూడుడు.

మిక్కిలి కృప, నమ్మాళ్వార్లకును వారి శ్రీపాదము లను ఆశ్రయించిన శ్రీరామానుజుల వారికిని ఉన్నట్లే, మన మణవాళమహామునులకును కలదు. శత్రువిషయములోను, హితపరయగు సీతాదేవివలె తన మతమునకు నిప్పుపెట్టిన వారిని కూడ క్షమించి, తత్సంబంధులను, పాలించిన ఐతి హ్యాము ఇచ్చట యెఱుంగ తగినది. ''దేవీలక్ష్మీర్భవసి దయయా వత్సలత్వేనచత్వం'' అని యెఱుంబియప్పా 'కారు ణ్యాముచేతను, వాత్సల్యముచేతను మణవాళమహామునులు లక్ష్మీదేవియే అని వక్కాణించి యుండుటయు, గమనింప దగినది.

## వైశద్యము

నమ్మాళ్వార్ల శ్రీసూక్తులు విశదములుగా నుండునవి. సంస్కృత వేదాంతములోగల సందేహములను తీర్చునవి. భాష్యకార్లు శ్రీభాష్యమును విరచించునప్పుడు సూత్రవాక్య ములలో ఏర్పడిన సందేహములను నమ్మాళ్వార్ల శ్రీసూక్తు లచే తీర్చికొనిరట. అంతటి వైశద్యము కలవి నమ్మాళ్వార్ల శ్రీసూక్తులు.

సంస్కృత వేదాంతార్థములను నమ్మాళ్వార్ల శ్రీ సూక్తులు విశదపఱచునట్లు ద్రవిడ వేదాంతములోను, రహస్య

ప్రస్థానములోనుగల వరిష్ఠార్థములును విశదపఱచు శక్తిగలవి మణవాళమహామునుల శ్రీసూక్తులే. "విశదవాక్ శిఖామణి" యని అనుభవించి యెఱింగినవారు కొనియాడుట పూర్ణముగా పొసగియున్నది కదా? రహస్యత్రయము, ఆచార్యపరంపరా క్రమ ప్రాప్తమై వివరణార్హమై ఉండినను తన వైభవము ప్రకాశింప, దాని అర్థమును హృదయములో లగ్నమగునట్లు ప్రకాశపఱచువారు మణవాళమహామునులే యని యెఱింబి యప్పా వక్కాణించి యున్నారు. "లక్ష్మీభర్తుః పరమగురుతాం లక్షయన్తీ గురూణాం పారమ్పర్యక్రమ వివరణీయాహి వాణీ పురాణీ! అర్థం తస్యాః ప్రథయసి చిరాదన్యతో యద్దురాపం దివ్యం తస్మై వరవరమునే వైభవమ్ దర్శయిత్వా॥" అనునది వారి శ్రీవాక్కు. తాత్కాలికాచార్యులు మనకు మంత్రోపదేశమొసగి యుండినప్పటికిని "గరీయాన్ అర్థదో గురుః" అనునట్లు వ్యాఖ్యాన గ్రంథముద్వారా అర్థమున వైశద్యము గలిగించునట్టి మణవాళమహామునులనే శ్రేష్ఠులైన ఆచార్యులుగా అనుసంధించుట తగును.

## వాక్చాతుర్యము

"మలక్కునావుడై యేఱ్కు మాఱుళదో ఇమ్మణ్ణిన్ మిశైయే" యనునట్లు సర్వేశ్వరునికూడ సంతోషముతో నుక్కిరి బిక్కిరి యగునట్లు చేయు వాక్చాతుర్యము కలవారు నమ్మాళ్వార్లు. శ్రీ నమ్మాళ్వార్ల నోటిమూలముగా తిరువాయ్ మొఴి వినుటకు భగవంతుడు ఆశపడెను. నమ్మాళ్వా

ర్లలో కలసి వారి వాక్కుచే తన్నుతానే భగవంతుడు పాడుకొనెను. ఆపాటలు గానప్రధానములుగా అమరియున్నవి. మధురములైన కవితలుగా రసవంతములుగా నున్నవి. తాను గానే పాడిన భగవద్గీతలవలె శుష్కములుగా లేవు. భగవంతునికి ప్రీతి లోపల నణగక వెలుపలికి స్రవించును. కావున ఆనందముతో గానాలాపనము చేయుచున్నాడు. సంస్కృతమున వాల్మీకి, వ్యాసులను బోలినవారును, ద్రావిడమున "ఇన్ కవి పాడుమ్ పరమకవిగళ్" (మధురములైన కవితల నొనర్చు ఉత్కృష్టకవులు) అనబడిన మొదలాళ్వార్లన పోలినవారును ఉండగా వారిని విడిచిపెట్టి నమ్మాళ్వార్ల తిరువాయ్ మొఱి దివ్యప్రబంధమునే విన ఆశపడి అపరిమితమైన సంతోషముతోనే వనాద్రీశుడగు సుందరబాహుస్వామి ఆలాపనము చేయుచున్నాడు.

మణవాళమహామునులును "వృత్త్యా వాచాం విబుధ సరితః చాతురీ ముద్గిరన్త్యా" అనునట్లు అడ్డులేకుండా గంగా ప్రవాహమువలె మాటలాడు చాతుర్యము కలవారే. శ్రీవారి వాక్చాతుర్యము భగవంతునికి కూడ విస్మయావహముగా నున్నది. నమ్మాళ్వార్లయొద్ద వినిన మధురములైన పాటల అర్థములను ఆ భగవంతుడు శ్రీమణవాళమహామునుల వాక్కు మూలముగా వినుటకు అభిలషించెను. మణవాళమహామునులను ఆహ్వానించి ఒక సంవత్సరకాలము గోష్ఠిగా వేంచేసియుండి తిరువాయ్ మొఱి వ్యాఖ్యానములను వారి యొద్ద శ్రీరంగనాథుడు శ్రవణము చేసెను. మణవాళమహా

మునుల శ్రీవాక్కు తిరువాయ్ మొళిగాథాసహస్రవ్యాఖ్యానములైన "ఈడు" ముప్పదియాఱువేలను రసప్రవాహమైన శ్రీరంగనాథుని ఆనందమును వర్ధిల్లచేసినది. నంజీయరు, నంబిళ్లవంటివారు ఎందఱో ఆచార్యులుండగా వారిని విడిచి మణవాళమహామునుల వ్యాగ్రసమునే అనుభవించి శ్రీరంగనాథుడు ఆనందసాగరములో మునిగెను.

## ఆనందింపించుట

నమ్మాళ్వార్ల కవితను వినిన వనాద్రీశ్వరుడగు సుందరబాహుస్వామి అపరిమితమైన ఆనంద ముప్పొంగ "తెన్నాతెనా" అని అర్థరహితమైన ఆలాపనము కావించెను. ఆ కవితలోని అర్థవిశేషములను మణవాళమహామునులయొద్ద వినిన శ్రీరంగరాజన్నానో వర్ధిల్లుచున్న సంతోషము ప్రాగ్రూపముగా స్రవింప "శ్రీశైలేశ దయాపాత్రం" అని ప్రారంభమగు శ్లోకమును కృతజ్ఞతతో సమర్పించెను.

## నూతనమంత్రము

ప్రపన్నగోష్ఠిలో ప్రథమాచార్యులైన ఆళ్వార్ల వద్ద మూలమును చరమాచార్యులవద్ద వ్యాఖ్యానమును శ్రవణము చేసిన ప్రారంభాచార్యుడైన లక్ష్మీనాథుడు "శ్రీశైలేశ" యను నూతన మంత్రము నొసంగి తానే చరమాచార్యుడు గాను ఆయెను. భగవంతునికి ప్రారంభాచార్యత్వము తనంతట సిద్ధించినది. చరమాచార్యత్వమన్నచో మణవాళమహా

మునులకు శిష్యుడై నందున నేర్పడినది. ఈశ్వరునికి గూడ మణవాళమహామునుల సంబంధమునొంది విలక్షణాచార్యుడై విలసిల్ల వాంఛ కలిగినదన్నచో మహామునుల ప్రభావము మనము ఏమని చెప్పుదుము.

## జన్మభూమి

భగవంతునికికూడ ఉపదేశించునట్టిపేర్మి యీయిద్దఱు ఆచార్యులకును, అవతరించిన భూమి మహాత్మ్యమువలన కలిగినది. ఇద్దఱును ఆళ్వారు తిరునగరిలో (కురుకాపురిలో) నవతరించిరి. ఇద్దఱికిని పుట్టినిల్లు ఆళ్వారు తిరునగరియే, మెట్టినిల్లు శ్రీరంగము.

శ్రీరామానుజులవారు తిరుక్కుఱుంగుడి నంబికి (వామన క్షేత్రస్వామికి) ఆచార్యులై ఉపదేశించియుండుటయు తిరునగరి గడ్డ ప్రభావముచేత నేయనుటయు నిక్కడ మెఱుంగదగినది. విభవమూర్తి శ్రీపెరుంబూదూరిలో అవతరించినను, అర్చామూర్తి అయిన భవిష్యదాచార్య విగ్రహము విభవావతారమునకు ముందుగానే తిరునగరిలో ఆవిర్భవించియుండుట మఱవరానిది. కాగా నమ్మాళ్వార్లు, రామానుజులవారు, మణవాళమహామునులును అవతరించిన దివ్యస్థలము తిరునగరి యనుట. ప్రారంభమున మధ్యమున చరమమునగల సంప్రదాయ ప్రవర్తకులు అవతరించిన తిరునగరి (తెన్‌కురగై) సాటిలేనిదిగదా.

## తదీయారాధనము

తిరునగరిలోనివారు ఇతరులవలె అన్నాదులను జీవనముగా గొనువారు కారు. వారికి జీవనమైన ఆహారము తిరువాయ్ మొఴియే. ఇది నమ్మాళ్వార్ల ఆశయము. "కుఴాజ్గోళ్ త్తే కురుగూర్ శడగోపన్ తెరిన్దురైత్త, కుఴాజ్గళాయిరత్తుళ్ళివైపత్తుమ్ ఉడన్ పాడి, కుఴాజ్గళాయడియారుడన్ కూడి నిన్దాడుమినే" యనుచోట "వాయుమ్‌తిరైయుగళుమ్" అను తిరువాయ్ మొఴిలో అనుభవించిన కష్టములనుండి తేఱుకొన్న తమ్మ తిలకింపవచ్చిన వేలలెక్కలో శ్రీవైష్ణవులకు వేల లెక్కలోనున్న తిరువాయ్ మొఴిని గోష్ఠిగానుండి పాడుటే జీవనముగా గల్లదని నమ్మాళ్వార్లు అభిప్రాయపడుచున్నారు. "తొణ్డర్కు అముదుణ్ణ" [భక్తులు ఆరగించు అన్నము తిరువాయ్ మొఴియే] అని నమ్మాళ్వార్లే చెప్పియుండుట గనుడు. కాగా సాత్వికులైన శ్రీవైష్ణవులకు సాత్వికాహారమైన తిరువాయ్ మొఴిచేత నమ్మాళ్వార్లు తదీయారాధనము - (సంతర్పణము) జరుపుట సమంజసమే యగును.

తిరునగరిలో అవతరించిన మణవాళమహామునులు నమ్మాళ్వార్ల అభిప్రాయప్రకారము తిరువాయ్ మొఴినే తమకు ఆహారముగా గొని యితరులకును దానినే వడ్డించి తదీయారాధనము చేయుట మిక్కిలి పొసగియున్నది. "మన్నియశీర్ మాఱన్ కలై ఉణవాగప్పెఱ్ఱోమ్" గుణవంతులైన నమ్మాళ్వార్ల దివ్యప్రబంధమును ఆహారముగా

పొందితిమి యని తమ వాక్కుచేతనే మణవాళమహామునులు తమకు ఉత్కర్షముగా చెప్పికొని యుండుటను గనుడు.

## మధురకవి నిష్ఠ

ఆహారమునకు అనుగుణముగా జ్ఞానము అమరును అనెదరు. పరమసాత్త్వికమైన తిరువాయ్ మొళిని ఆహారముగా గొనిన శ్రీవైష్ణవులకు అహంకారాదులు సంభవించుటకు మార్గమే లేదు. కావున త్యాజ్యములైన అర్థకామములకోసము జగడమాడక సాధుగోష్ఠిలో అంగీకృతులై చరమపర్వమైన భాగవతశేషత్వమున నిరంతరముగ నెలకొనుట సాధ్యమగును.

అన్నదాతలే ప్రాణదాతలు కాబట్టి మనకు అన్నదాతయగు నమ్మాళ్వార్లే శేషి. వారే మన దైవము, అను బోధము మనకు ఏర్పడవలయును. ఇదే తిరువాయ్ మొళి యనుభవమునకు ప్రయోజనము. ఈ ప్రయోజనమును పొందిన మధురకవులు "తేవుమ్ మత్తఱియేన్" —ఇతర దేవతల నెఱుగను అనెడి వారి నిష్ఠ లభించుటయే మనకు పరమోద్దేశ్యము. అట్టి మధురకవి నిష్ఠనొందియున్నవారు మన మణవాళమహామునులు. "మధురకవి శొల్ప్పడియే నిలైయాగ ప్పెత్తోమ్" మధురకవి యాళ్వార్లు అనుగ్రహించినట్లే ఆ నిష్ఠలో నిరంతరముగా నున్నామని శ్రీవారే వక్కాణించి యుండుటను గనుడు. శ్రీవారికి లభించిన మధురకవినిష్ఠ

నుండియే తిరువాయ్ మొழి నూత్ అన్దాది యను ప్రబంధ ముద్భవించెను.

## తిరువాయ్మొழియు శ్రీరామాయణమును

తిరువాయ్ మొழి దివ్యప్రబంధమునకు చరమ ప్రమేయార్థము నమ్మాళ్వార్లేయను రహస్యార్థమును మణవాళ మహామునులు తిరువాయ్ మొழి నూత్ అన్దాది మూలముగా మనకు ప్రదర్శించిరి. శ్రీరామాయణమునకు చరమ ప్రమేయార్థము లక్ష్మణరూపిమైన మణవాళమహామునులే యను రహస్యార్థమును ఎఱుంబియప్పా వరవరముని శతకమున మనకు కనిపించిరి. విస్తరభయముచే ఈ రహస్యార్థమును ఇచట వివరింపకుంటిమి.

కాగా, మన సంప్రదాయమునకు సంరక్షకములైన తిరువాయ్ మొழిచేతను, శ్రీరామాయణముచేతను మనకు పరమోద్దేశ్యములైన దైవములు వరుసగా నమ్మాళ్వార్లును మణవాళమహాములునే అని గుర్తించి ఉజ్జీవింతముగాక.

మణవాళమహామునుల షష్ఠశతాబ్దీ మహోత్సవమును మహోత్సాహముతోగూడ కొనియాడుచున్న కమిటీవారికిని ఈ యుపన్యాసమును ముద్రణచేసి ప్రకటించిన మహానుభావులకును నమ్మాళ్వార్ల, మణవాళమహామునుల పరిపూర్ణానుగ్రహముచే నిరంతర సంపదభివృద్ధి యగునుగాక.

వరవరముని శ్రీపాదములే శరణం

---

# శ్రీశైలేశ వైభవమ్



శ్రీమన్మణవాళ మహామునులవారు నంబెరుమాళుకు
తిరువాయ్మొళి ఈడు కాలక్షేపమొనరించుట.

సాత్తుముర సమయములో నంబెరుమాళ్
బాలుడుగావచ్చి ఆచార్యునికి సమర్పించిన తనియన్

శ్రీశైలేశ దయాపాత్రం ధీభక్త్యాది గుణార్ణవమ్ ।
యతీన్ద్రప్రవణం వన్దే రమ్య జామాతరం మునిమ్ ॥

# ஸ்ரீ திருமலை நல்லான் சக்ரவர்த்தி ஸ்ரீ. உ. வே. ராமகிருஷ்ணய்யங்கார் சுவாமிகளால் அருளிச்செய்யப்பட்ட க்ரந்தங்கள்

---

1. சதுச்லோகியோடு கூடிய ஸ்ரீ ஸ்தவம் பொன்னுரை என்னும் தமிழ் வியாக்யானத்தோடு கூடியது — ரூ 1-00
2. ஸ்ரீகுணரத்நகோசம் சுவர்ணகுஞ்சிகை யென்னும் தமிழ் வியாக்யானத்தோடு கூடியது — ரூ. 2-50
3. ஸ்ரீஸ்துதி அர்த்ததாரை யென்னும் தமிழ் வியாக்யானத்தோடு கூடியது — ரூ. 2-00
4. ஸ்ரீஸ்துதி மூலம் மாத்திரம் — ரூ. 0-10
5. ஆண்டாள் திருமணம் திருப்பாவை பாவங்களை விசதீகரிக்கும் தமிழ் நாடகம் — ரூ. 2-00
6. திருக்கச்சி நம்பி நான் மணி மாலை வியாக்யானத்தோடு கூடியது (தமிழ்) — ரூ. 1-00
7. முதலியாண்டான் வைபவம் (தமிழ்) — ரூ. 2-00
8. ஆண்டாள் அந்தாதி தாத்பர்யத்தோடு கூடியது — ரூ. 1-50
9. முதலியாண்டான் வைபவம் (தெலுங்கு) — ரூ. 2-00
10. ஸ்ரீதாசரதி குரு சுப்ரபாதம் தெலுங்கு, தமிழ் தாத்பர்யங்களுடன் கூடியது — ரூ. 0-75

கிடைக்குமிடம்

**C. முதலியாண்டான்,**
**நெ. 27, காசி செட்டித் தெரு,**
**சென்னை-1.**